# * తొలిపలుకు *

ఆర్యసోదరీసోదరులారా !

భూలోకములో కరుణాసముద్రుడైన పరమాత్మునిలీలలు అనంతములు. ఆతనిశక్తి అపారము. ఆయనమహోత్కృష్టమైన వానిని వర్ణించుటెట్లు. అతనిశక్తి తెలియుట యెట్లన: ఉప్పుబొమ్మ సముద్రము లోతుకొలువ సముద్రములోదిగినట్లే. ఆతడు తనయిచ్చవచ్చినరీతిని ప్రపంచముపాలింపశక్తి కలవాడైనను, నియమమునను సరించి పాలించుచున్నాడు. నియమములేనిదే యేకార్యముగూడా స్వతంత్రముగాజరుగ నేరదు. కాన చాంచల్య చిత్తులైనను మానవులము విధిగానియమమును పాటింపవలెను.

భగవత్శక్తి తెలియుటకు స్వానుభవములో చిన్నహాంశము నొకదానినితెల్పెదను. దానినిబట్టి నీబుద్ధిపోయినంతవరకు ఆతని శక్తినిగురించి ఆనందించి తరించెదరుగాక ! మూఢాత్ముఁడనగు నాబోటివానిచే శతకము రచింపజేయుటలో ఆతనిశక్తిని మీరు పూర్తిగాగ్రహింపవచ్చును. విద్యాశక్తుండనుగాక, శాస్త్రము నెరుగక, ఛందస్సుగమనింపక, వ్యాకరణము చదువక యీ పద్యముల రచించుటలో ఆశక్తియే నాకుతోడ్పడకపోయిన నేనెట్లుకృతకృత్యుఁడను కాగలను. అయినప్పటికిని అమృతప్రవాహము గంధకపు గనిమీదుగప్రవహించిన అమృతము చెడునట్లు నాబోటిపాపాత్ముని మనోవాక్కులనుండి భగవత్ప్రేరేపణచే వచ్చినప్పటికి యీ పద్యములయందు చెప్పరాని తప్పులుండునని పరులు ఆరోపింపకయే తల వంచివినయవిధేయుఁడనై నమస్కరించి యొప్పుకొనుచున్నాఁడను. నన్నుక్షమించెదరుగాక ! లోహమునకు పరసవేదితగిలిన బంగారమగునట్లు భగవత్శక్తి అధికమై యెక్కడనయినను సద్భావమునగాని, సుశబ్దసంపుటీగానియున్న అదినాస్వామి రాధాకృష్ణుని

లేశమాత్రము కృపావిశేష ఫలితముగా తెలిసి బ్రహ్మానందవ నొందెదరుగాక !

నన్ను మొదటిసారి గుంటూరుతీసికొనివచ్చినపుడు లోగ వ్రాసిన యీ శతకమును పూర్తిచేయుచుంటిని. ఆ పద్యముల శ్రీ పంగులూరు శేషతల్పశాయి బారిష్టరుగారి హృదయేశ్వరియగ మ॥ ల॥ స॥ రాజ్యలక్షమ్మగారుచూచి శతకము త్వరలోపూర్తి చేయుమని హెచ్చరించిరి. మరలనెలదినములకే నన్ను స్వగృహ మునకు దీసికొనివచ్చినపుడు ఒకనాటిసాయంత్రము దంపతులిర వురువచ్చి శ్రీ రాధికేశ్వరశతకము మేముఅచ్చువేయించెద మని వాగ్దానముచేసి యీ శతకమునుసార్ధకపరచి పుణ్యముగట్టుకొనిరి ఇట్టిసత్కార్యములలో పాల్గొన్న యీపుణ్యదంపతులను, పురాణ దంపతులగు రాధామాధవులు నిరంతరముతోడై అష్టైశ్వర్య సం పన్నులుగా దీవించిరక్షించుగాక !

ఇట్లు

సర్వభక్తాదీనుఁడు

**అయినపర్తి వేంకటసుబ్బారావు.**

శ్రీ వాణీవినాయక రాధాకృష్ణ హనుమద్దాస గురుభ్యోన్నమః

# శ్రీ రాధికేశ్వర శతకము.

ఉ॥ శ్రీనగజాతనందనుని శేషవిభూషణునిన్ గుమారునిన్
భానునిపద్మసంభవుని వాణినిపంచముఖాంజనేయునిన్
శ్రీనిధినిన్నుభక్తులను జిత్తములోనదలంచివ్రాసి నే
గానుకగా నొసంగెదను గైకొను మీకృతి రాధికేశ్వరా॥

చం॥ పరిగుణహీనుడైన ధనవంతునకమ్మిసరస్వతిన్ ధనా
ధరణగజాశ్వవస్త్రగృహ భామినులన్ గొనికాలునాజ్ఞచే
నరకపుబొందలేక గృతినాథునిజేతురునిన్నుభక్తు లా
తెలుగుననేనొసంగెదకృతిన్ గొనుమిత్తరిరాధికేశ్వరా॥

ఉ॥ వ్రాసితినామగీతముల వ్రాసితినేశతకంబులింపుతో
వ్రాసితినీతిబోధకల వ్రాయుచునుంటిమదాత్మగాధ నే
వ్రాసినవెల్లనీకరుణవల్లనుగా కతిమూఢుడైన యీ
దాసునకన్యశక్తిగలదా గురుదేవర రాధికేశ్వరా॥

చం॥ కలిగినబాలపంచి కృతికన్యలముద్దుగబెంచిపెంచి మూ
ర్ఖులకరమందుబెట్టుటకు రోసియుయోగ్యవరార్థమాత్మలో
కలవరమొందుచుంటగని కన్యలుకృష్ణుని మేముజన్మతో
వలచితిమన్ననిన్ను గృతిభర్తనుజేసితిరాధికేశ్వరా॥

ఉ॥ కృష్ణ కృపాలవాల హరికృష్ణ పరాత్పరకృష్ణ రుక్మిణీ
కృష్ణ సమస్తలోకనుతకృష్ణ జనార్దన కృష్ణ ద్వారకా
కృష్ణ సుదర్శనాభరణ కృష్ణ యశోద ముఖాంబుజార్క శ్రీ
కృష్ణ ముకుంద గోపకులకృష్ణ నిరామయ రాధికేశ్వరా॥ 15

చం॥ గడుసుదనంబు, బద్ధకము, గర్వము, కోపము, రాజసంబు, నా
బడుగుతనంబు, దుర్బలము, పాపము, లోపము, మందభక్తియా
యడుగులనాశ్రయించుకొల దార్తినిదీర్పవికేమిసేతు నీ
జడునియనుగ్రహించుటకసహ్యము యాదవ రాధికేశ్వరా 16

ఉ॥ కృష్ణుడె తల్లిదండ్రి హరికృష్ణుడెనాయిలవేల్పు రాధికా
కృష్ణుడెతోడునీడ, యికకృష్ణుడె చుట్టముపక్కముస్ సదా
కృష్ణుడెదిక్కునాకనుచు, కీర్తనజేయుచుజాటుచుంటి నో
వైష్ణవతేజ నన్నెటులబాలనజేసెదొ రాధికేశ్వరా॥ 17

చం॥ తలచెదనీకృపారసము దారినిబోవుచుసంస్మరించెదన్
బిలచెద, మోక్షమిమ్మనెద, వేడెద, బాడెద, విష్ణుభక్తులన్
గలసెద, దుర్గుణాళ్వీడెద గాంతలతల్లులరీతిజూచెదన్
నిలచెదనీపదాలకడ నిన్నుభజించెద రాధికేశ్వరా॥

ఉ॥ చేసితి ఘోరపాపములు, చేసితిభాగవతాపచారముల్
చేసితిదైత్యకృత్యములు, చెప్పగరానివనేకముల్ భువిన్
జేసితి జేసినేదిగులుజెందుచునుంటి భయంబుబాపి నీ
దాసునిజేసి సద్గతికిదారినిజూపర రాధికేశ్వరా॥

చం॥ పరమ కృపాకరుండనుచు భాగవతుల్ తమ గ్రంథకోటిలో
విరివిగవ్రాసి నల్దిశల వెల్లడిజేసిరి నీ స్వభావమున్
మరువను, ముక్తినొంద నొకమార్గము గన్పడెవాసుదేవ నీ
చరణములాశ్రయించితిని జాలివహింపుము రాధికేశ్వరా॥ 20

ఉ॥ పోలికమన్మనోఫలకమున్ రచియించి యపారభక్తితో
గాలముసర్వమున్ గడుపగాదలపోసితి నెందుదాగితో
చాలురయీ ప్రపంచమున సన్నుతికెక్కిన కృష్ణనామమే
మూలను దాచుకోగలవు పుణ్యమగణ్యము రాధికేశ్వరా॥ 2

చం॥ సురనుతనామ- దీనజనశోకనివారణకారణా, జగ
ద్గురువరగోపికారమణ కుంజరగామినిమానరక్షణా
వరదప్రసన్నపద్మముఖ భద్రమనోహరభక్తవత్సలా
దురితవిదూర నన్దురితదూరుని జేయవ రాధికేశ్వరా॥ 2

ఉ॥ కోపముజూపకయ్య పసికూననురక్షణసేయుమయ్య నా
పాపముబాపుమయ్య హరిభక్తులదీనుల బ్రోవుమయ్యయే
లోపమునెంచకయ్య పరలోకసుఖంబులగూర్పుమయ్య నీ
రూపముజూపుమయ్య నినురూఢిగనమ్మితి రాధికేశ్వరా॥ 2

చం॥ శిరమునగేకిపింఛమొకచేతనువేణువు, దివ్యకౌస్తుభా
భరణముకంఠమందు, ముఖపద్మముపైరుచులీనునూత్న క
స్తురితిలకంబునాభినొకతోయజమున్, గటిసీమనొక్క బం
గరువసనంబుగల్గినజగన్నుత మ్రొక్కెద రాధికేశ్వరా॥

ఉ॥ కోరను రాజ్యభోగ్యరథ కుంజరసౌధభటాశ్వరత్న శృం
గారవనాంబరాప్తపసు కామ్యవినోదసుఖంబులాది నే
నారయబుట్టినందులకు నయ్యదినావిధిగాన సర్వదా
కోరెదభక్తినీయడల గోరికదీర్పర రాధికేశ్వరా॥ 25

చం॥ కటకటనేమిసేతు నొకకష్టునినన్ను నుపేక్షజేసి బ్రో
చుటకెదనెంచకున్నవిక శోకనివారణజేసిబ్రోవ ది
క్తటములనేరుకాగలరు దాసచకోరసుధాకరా తరిం
చుటకికదారిలేద దృతశోకుడ, బాపుడ రాధికేశ్వరా॥ 26

ఉ॥ వేదవినోద,కృష్ణుడనవిష్ణువు భక్తశరణ్యుడంచు నే
దేదియొచెప్పుచున్నతరి నించుకకల్గిన సంశయంబుచే
వాదముజేసిజూపుమనువారల కెవ్వనిజూపనేర్తు నీ
వాదరమొప్పనాహృదయమందు వసింపర రాధికేశ్వరా॥ 27

చం॥ హరిహరిరాధికారమణ యచ్యుతమాధవకృష్ణయంచు నె
వ్వరు హరినామకీర్తనలబాడుచు నాడుచుసంస్మరింతు రా
పురుషులనీడకైనచనబోకు డపాయమటంచుచెప్పి కిం
కరులనుబంపుచుండునట కాలుడు భూమికి రాధికేశ్వరా॥ 28

ఉ॥ చిక్కవువేషభాషలకు జిక్కవుగ్రంథములంబఠించినన్
జిక్కవుయుక్తిమాటలకు జిక్కవుదానతపస్సులంగదా
చిక్కవుశౌచశీలముల జిక్కవుసూత్రవ్రతదీక్ష భక్తికిన్
జిక్కనరీతి భక్తజనచిత్తవశీకర రాధికేశ్వరా॥ 29

చం॥ శరణుమహాప్రభో శరణుసామజరక్షణపక్షివాహనా
శరణుదయానిధే శరణువారిజలోచనపాపనాశనా
శరణుమురాంతకా శరణుసజ్జనరంజనదుష్టభంజనా
శరణుపరాత్పరా శరణుసర్వజగన్మయ రాధికేశ్వరా॥ 30

ఉ॥ చిక్కలదీర్చిబ్రోతునని చెప్పవు మత్పదభక్తకోటిలో
నొక్కనిజేతునిన్ను సుచు నొక్కవచింపవు నమ్మకంబుచే
దక్కవయేమినాకు హరిదాపుననుంటినటంచు వెర్రినై
నిక్కితి మాయలోబడితి నింక పరాకున రాధికేశ్వరా॥ 31

చం॥ చరచరయెల్లవాహినులు సాగరముంగలియంగ వేడ్కతో
బరుగునబోవురీతి నిజభక్తులమానసరాజహంసముల్
బరుగిడుచుండు నీసగుణదర్శనభాగ్యవిశేషతోష సా
గరమున నోలలాడుటకు గానకళానిధె రాధికేశ్వరా॥ 32

ఉ॥ పంకిలమం దుబుట్టినను పద్మము దానినెరింగిభృంగ మా
వంకకుబోవ ఏ. యామధువుబానముచేసితరించునట్లు నీ
కింకరుడెట్టిహీనకులకింకరుడైనను భక్తకోటి యే
గొంకునులేక భక్తిసుధ గ్రోలితరించును రాధికేశ్వరా॥ 33

చ॥ తహతహలాడుచుంటి పరితాపముబాపరదాపుజేరి నే
నిహమునుగోరలేదు పరమేగతినై సగణించుకొందు నో
విహగతురంగరంగ యవివేకినిదర్శనభాగ్యమిచ్చి నా
కహహ ముదంబుగూర్చగదవయ్య భజించెద రాధికేశ్వరా॥ 34

ఉ॥ బాలుడ బ్రాహ్మణుండ పదభక్తుడనంధుడదీనుడన్ రమా
బాలకునేరగాడ, పరపంచనివాసుడ బ్రహ్మచారుడన్
చాలుముచాలు నిన్నుకనజాలనిజన్మవృధావృధాగదా
జాలముమాని దర్శనమొసంగుమొసఁగుము రాధికేశ్వరా॥ 35

చం॥ వనమునకేగియో, నదులవాగులప్రక్కవసించియో, నగం
బునగుహమండియో సుఖముపుణ్యముబొందగవచ్చుగాని దు
ర్జనగణమధ్య భక్తునకు శాంతియుసౌఖ్యముకల్గబోదు నా
కనువగుమార్గముందెలుపు మట్లుచరించెద .... 36

ఉ॥ కాలునిదూతలేగ్రగనుగాలిన శూలములందధరించి నా
మ్రోలనునిల్వ నిన్నుమదిలోనభజించెదనోభజింపనో
జాలివహించి నీసుభటసంఘమునంపి యమోగ్రచారులన్
గూలిచి జేర్చుకొమ్ము నిజకొల్వునకున్నను .... 37

చం॥ గుణివనికొందరాదేదరు కొందరునిర్గుణివందురీభువిన్
గుణివియునిర్గుణుండవని కొందరుచెల్పుదురేదిసత్యమో
యణువుప్రమాణముంది జగమంతయువింతగనిండియుండినా
వనివచియింతు రేగతినుపాసనజేయుదు .... 38

ఉ॥ కంటినినీకృపారసము గంటినిరొంటినిగోలుపోయినే
నుంటిని, నిన్నుజూడయిటులుంటిని దర్శనమియ్యవేగర
మ్మంటిని, పాపనాశకుడవంటిని దీనులబ్రోతువంచునే
వింటిని. దొడ్డవేల్పువనివేడుచునుంటిని .... ౮౯

చం॥ సిరిగలవానిజేరి తనచిక్కులజక్కగదెల్పిబీద పే
దరికముబాపుకొన్నగతి దాసుడునిన్నుభజించిమోహసం
భరితనిశాలవారధిభవత్కృపచేతనుదాటి ము ౘా సుం
దరినివరించివేడ్కను సదాసుఖియించును రాధికేశ్వరా॥ 40

ఉ॥ ధాత్రిహిరణ్యకన్యగృహదంతుల దానమొసంగవాని క్షే
మాత్రములెక్క యొక్కపసిపాపనిపాలకునావునియ్య లో
కత్రయపోషసర్వజనకామ్యములన్ సమకూర్తువంట నే
బాత్రుడనౌదునేని నిజభక్తినొసంగర .... 41

చం॥ బహుగులకున్ మహాత్ములకు భక్తులకున్ గులభామినీలకున్
దుదుకుతనంబుచేసునుపు ద్రోహములేమియొనర్చినాడనో
యిడుములనేకముల్ బడుచు నిట్టులజీవముమేననిల్పనే
గడియయుగంబుగా గడపగల్గుచునుంటిని .... 42

ఉ॥ ౙనకనీకొసంగుటకుకానునకైననుమార వింకస
న్మానముజేసియిచ్చుటకు నాకడకేవలమాత్మతప్ప వే
రేనిధిలేదు పేదననియెంచక నాత్మపరిగ్రహించి యీ
దీనునిపైననుగ్రహము తేటగజూపర.... 43

చం॥ కడపటిలేగపైకరుణగల్గుట నా వెడదూడవచ్చినన్
జిడిముడికొముల్మన్ బొడిచి చేరగనియ్యనిరీతి నేమహా
. త్ముడునినుజేరెనోయిపుడు తొల్లిటినన్నుపేక్షచేయుచు
న్నవడిరాడికనుంటివి యనాథుడకావర .... 44

ఉ॥ ఎందరురాజులేగిరి మరెందరుభోగులుజోగులైరి ము
న్నెందరుభక్తులైరిధర నెందరుపుట్టిరిచచ్చిరెంద రే
నందరిసంగతుల్ దెలసి వ్యర్థముజేయగనేలకాలమున్
దొందరజెందినీస్మరణతో నివసించెద .... 45

చం॥ అలసిపరుంటివా జగములన్నియునేరినబద్ధకంబు చే
కులుకుచురాధతోగలసి కూననునాదెసచూడకుంటివా
పలికినసత్యకోపమునపైబడి తన్నునటంచుభీతియా
పలుకకనుంటివా కపటవర్తనయేటికి .... 46

ఉ॥ ఫాలమునేలమోపిభవభంజన పావనభక్తరంజనా
చాలగవేడుచుంటినవసానమునందు కటాక్షముంచి న
న్నేలెదవన్ననమ్మకమదెట్టులగల్గును నేడుబ్రోచుకో
జాలకనాడుబ్రోతువన సందియమేగద .... 47

చం॥ చెడుగుడినాడుచున్నతరి చిన్నతనంబుననేస్తగాండ్రతో
గుడితొడరెండుగావిరిగె గ్రుడ్డితనంబువరించెపిమ్మటన్
పడుకొనిరాత్రిమేల్కొన దభాలునగోడవిరింగివీపుపై
పడనడుమప్పుడేవిరిగె పైగదరిద్రుడ .... 48

ఉ॥ కూరుకుహెచ్చురాజసము,కోపము పూర్వులసాంప్రదాయ మా
హారముచాలగావలయు,నాశకునంతములేదు హాస్య సం
పూరితభాషయాత్మనుతి పూర్వమునుండియునాశ్రయించె నే
తీరునభక్తికల్గునిక దీనుడదీనుడ .... 49

చం॥ జపమునగూరుచుండుటకుజాలను, నడ్డినిగాన,యాత్రలం
దుపగతిపోయివచ్చుటకునొల్లను, కుంటినిగాన,గీతలన్
నిపుణతతోబఠించుకొననేరను, జీకునుగాన,వింకనా
జపతపయాత్రలాది తవసన్నుతనామమె 50

ఉ॥ పట్టితినిన్నుదైవమని పాపవిమోచనకృష్ణనామమున్
బట్టితి యట్టినామసుధ భక్తులకీగతిబంచిపెట్టగా
బుట్టితిభక్తిశాంతిదయమున్నగు వానినొసంగుమంచు మొ
ర్రెట్టితి మాయలోకమునవేషముగట్టితి .... 51

చం॥ తలచితినీమహత్వమును తండ్రిగనెంచిభజించి నిన్నునే
బిలచితిజన్మకర్మలను భీకరమందిరరాకపోకలన్
సొలచితికాలునాగ్రహపు చూపులలోబడలేకప్రేమతో
గొలచితిదుర్గుణంబులను కొన్నిటిగూర్చితి .... 52

ఉ॥ కాంతలబుత్రులన్విడిచి కాననసీమనుజెట్లక్రింద నే
కాంతముగానశించినను గ్రంథవిమర్శనజేసినన్ సుధ
మంతులనేస్తమబ్బినను మౌనివ్రతంబుననుండినన్ సరే
శాంతములేకనెవ్వరికి సౌఖ్యముగల్గదు .... 53

చం॥ ఇటునటునేదిశంగనిన నేమియుదోచదపారఘోర సం
కట దురితాలవాలకలికాలమునందుజనించిమాయచే
నిటునటువాయగొట్టబటి యించుకతొల్లిటివాసనాస్మృతిన్
స్ఫుటమతినీపదాబ్జములసోకితి సొక్కితి .... 54

ఉ॥ మాయకదాశరీర మొకమాయకదాజగమంతచూడగన్
మాయనుమాయలోననిడి మాయకునావలనీవువాసముఁ
జేయుచు మాయమానవులజీకటివెల్తురులఁదెమల్చుచుఁ
మాయలమారివేషమున మాకడనుంటివ .... 55

చం॥ వలసినకాలమందొడలిపైవలువఁ దిగనూడ్చిపిమ్మటఁ
వలువధరించుమానవునిభాతి శరీరముబాసి జీవుడా
వలనొకనూత్నదేహమున వారకజొచ్చిపెరుంగునింక వ్యా
కులపడనేలమృత్యువునకుఁ గుణవంతుడు .... 56

ఉ॥ చచ్చినవారితోగలసి చచ్చుటకెవ్వనిసాధ్యమౌను. తా
జచ్చుటకున్‌బ్రయత్నములు సల్పినకీడులుమూడు మాయచే
వచ్చుసమస్తకష్టముల ప్రాజ్ఞుడుధైర్యముతోజయించి పై
పెచ్చుగధైర్యముఁదెలుపు భీరువమూకకు 57

చం॥ కలిగెనుపూర్వజన్మమున కర్మవిశేషఫలంబుచే నినుఁ
దలచితరించుభాగ్యమతి ధన్యుడధన్యుడనింక రిత్తకో
ర్కెలవిడనాడిచిత్తమున రేయిపవల్‌తమరూపనామముల్
విలిపిసుపుణ్యమార్గమున నేవివపించెద .... 58

ఉ॥ నీమమునిష్టలేనియొకనీచుడ గాముకుడన్‌దురాత్ముడఁ
తామసుడఁనరాధముడ తప్పులనేకముజేసి పైకిని
షాకమితెరంగుగానబడు కల్మషచిత్తుడబుద్ధివచ్చె నో
స్వామిభవత్కృపఁజిలికి పావనుజేయర .... 59

చం॥ దొరలకుదొడ్డవారలకు దుష్టులకున్ నిరుపేదవాండ్రకున్
బరులకుభాగ్యవంతులకు భక్తులకున్ చెలికాండ్రకీధరన్
మరణముతప్పదయ్యది సమానముటంచునెరింగిగూడ తొం
దరపడదేలనామనసు తాపసవృత్తికి .... 60

ఉ॥ నిన్నుభజించుమాత్రమున నిర్మలమైహృదయంబుశాంత సం
పన్నతనొందునంచనెడి భక్తులవాక్యములాలకించి యా
పన్నశరణ్యనిన్నధికభక్తిని వేడుచునుంటిగాని నే
నెన్నడుతత్సుఖం బనుభవించియెరుంగను .... 61

చం॥ స్థిరముగుభక్తినిచ్చి నిజసేవకబృందములోననన్ను ని
ర్తరిణొకపేదభక్తునిగ తప్పకజేసెదవంచునమ్మి నీ
చరణములాశ్రయించుకొని సాధనజేయుచునుంటి ముక్తికై
గురుపరయెట్లుబ్రోచెదవొ కోపినిపాపిని ... 62

ఉ॥ త్రావెదనీకథామృతము త్రావెదనీఘనపాదతీర్థమున్
త్రావెదనీకృపామృతము త్రావెదనీగుణకీర్తనామృతమున్
త్రావెదనీదునామసుధ త్రావెదభక్తిరసామృతంబు నే
ద్రావుచుదోడివారి కనురక్తినిబంచెద .... 63

చం॥ నిరుపమతేజునిన్ దెలియనేరరు దేవతలైనవేద గో
చరుడవుగావుమౌనులకసాధ్యము నిన్నునెరుంగయోగికిన్
దొరుకవునీవుభక్తజనతోరపు భక్తికిజిక్కివారి హృ
ద్గిరులనటించుచుందువట దివ్యదయాకర .... 64

ఉ॥ గొప్పకుగాదునాభజన గొంతుకమార్దవమైనలేదు ఛీ!
కప్పముగైకొనంగనొకకాంక్షయులేదు మహాత్ములెల్లరున్
జెప్పుకొనంగగాదు పలుశిష్యులజేర్పతలంపులేదు నే
నిప్పుడుపుట్టితిన్ గనుక నియ్యదినావిధి .... 65

చం॥ భజననుజేతుకీర్తనలపద్యములల్లుదు భారమంత నీ
భుజములపైనిమోపి వినుమోకరుణార్ణవచంద్ర పక్షిరా
డ్ధ్వజనిజమానతిచ్చితిని భక్తదయాళువుగాకయున్న నే
విజయమునొందగలుదునె పెంబరివిత్తును .... 66

ఉ॥ పాతకమేమిచేసితిని భక్తులకేమియుపద్రవంబు సం
ప్రీతినొనర్చితిన్ పుడమివేల్పుల కార్తులకిష్టమూర్తికిన్
ఘాతుకమేమిపన్నితిని కన్నులకున్ గనరాకయుంటి వ
య్యోతగునా యమాయకుఁడనో కరుణాకర .... 67

చం॥ కొలకులవాగులన్ నదులగుంటలభావుల సాగరంబులన్
జలములగ్రోలనొల్లకను సారమెరుంగుటవర్షధారకై
నిలచెడిచాతకంబుగతి నీరసదేవతలెందరుండినన్
దలపకవేచియుంటి తమదర్శనప్రాప్తికి 68

ఉ॥ ఎవ్వడువిశ్వమందిరము నీగతిజీవులకున్ సృజించెనో
యెవ్వడుభక్తలోకమునకెల్ల శుభంబులగూర్చుచుండెనో
యెవ్వడుధర్మదేవతకు నీడనొసంగధరన్ జనించెనో
యవ్వనమాలివీవెయని యాడెదపాడెద .... 96

చం॥ కపటములేనివారలకు కాంచనరక్తియులేనివారికిన్
విపులవిరాగచిత్తులకు విష్ణుపదార్చనసేయువారికిన్
తపమొనరించువారలకు దాపునయుండెదవంటనీవు నా
కిపుడొసగంగదేకరుణ నీసుగుణంబుల .... 70

ఉ॥ కొందరుగర్భమందు మరికొందరుభూపతనంబు పిమ్మటన్
కొందరుబాల్యమందు నికకొందరువార్ధికమందు మృత్యువున్
జెందుటచూచుచున్ ఖలులజేరరు నిన్నుభజించిమోక్షమున్
బొందమహాత్మవారికెట ముక్తికలుంగును .... 71

చ॥ కొలచెడివారికిచ్చెదవు కొన్నిసుఖంబులు తమ్ముభక్తితో
కొలచెడివారికిచ్చెదరు కొన్నిసుఖంబులు మానవోత్తముల్
విలువగునీకుమర్త్యులకు భేదముదేదిమహాత్మకాన మూ
ర్ఖులనుదరింపజేయుమని మ్రొక్కుచునుంటిని .... 72

ఉ॥ పున్నెముచేయువారలకు మోక్షముతథ్యము పుణ్యమన్న తా
మెన్నడెరుంగనట్టిగుణహీనులకున్ గతియేమికావలెన్
నన్నధమున్‌క్షమించియిలనందర నుజ్వలభక్తిభావ సం
పన్నులజేసిబ్రోవగదె భక్తదయాపర .... 73

చం॥ జలధరమన్నభోస్థలిని జక్షురగోచరమైనతోడనే
కిలకిలలాడుచున్నెమలిగిర్రున పించమువిప్పిదేహమున్
తెలియకనాట్యమాడుగతి దేవరవారినిచూచి ఎప్పుడీ
యిలముదమొందిమైమరచి నృత్యముచేతునొ .... 74

ఉ॥ నమ్మితినీపదాబ్జములనమ్మితి నాకిలవేల్పువంచు నే
నమ్మితినిఁసదామదినినమ్మితి భక్తులఁబ్రోతువంచు లో
నమ్మితినమ్మితిఁమిగులనమ్మితి నమ్మితినింకనైన నా
నమ్మికలేమిచేసెదవో నందతనూభవ .... 75

చం॥ పురముల,భామినీమణుల, పుత్రుల,మిత్రుల,భూమిపుత్రులఁ
గరుల,హయంబులఁ,మణుల, గాసుల,దాసుల,గోగణంబులఁ
సిరుల,రథంబులీయమని సేవనుజేయగజేరలేదు సు
స్థిరమగుభక్తి నిత్తువని జేరితినీకడ .... 76

ఉ॥ వద్దుపరాకు భక్త జనబంధుడవన్నకితాబు మాపుకో
వద్దు నదీతటాకవటపాదపశాఖలమధ్య దాగబో
వద్దు మహానుభావుల సపర్యలబొందుచు ఖేదమోద సం
బద్ధుడనంచునఁ మరువవద్దుజనార్దన .... 77

చం॥ నిజమగుభక్తి,భూతదయ,నీతి, పరస్పరమైత్రిసాహస
ప్రజపితృమాతృసేవ, గురుభక్తి,మహోన్నతచిత్తశుద్ధి యీ
పృజలకునీవొసంగనిక బాలనసేయదలంపవేని భూ
భుజుడగుశేషుడివ్వసుధ మోయుటభారము .... 78

ఉ॥ ఇప్పటికైననాయెడల యుంచుకసాదరప్రేమజూపి నా
తప్పులనన్నిటిన్ మరచి దాపునకుఁజనుదెంచి నిన్ను నే
తప్పకప్రోతునంచు బరితాపముజెందకుమంచుజెప్పి న
న్నెప్పుడుబ్రోతువోయెరుగ హేకరుణాకర .... 79

చం॥ హరిపురుషోత్తమాచ్యుత జనార్దనమాధవపద్మనాభ శ్రీ
ధరనరసింహకేశవసితాంబుజలోచనవాసుదేవ మం
దరధరదేవకీతనయ దైవశిఖామణికృష్ణ పండరీ
పురపరిపాలన న్నెటులబ్రోచెదవోకద .... 80

ఉ॥ కొండలచుట్టివృక్షములగూలిచి మిట్టలదాటివీలుగా
నుండుసమప్రదేశములగోసి ప్రవాహముసాగరంబులో
దండిగజేరుచందమున దారినివచ్చుమహావిపత్తులన్
జెండితరించుగాదె నినుజేరిమహాత్ముడు .... 81

చం॥ ఇపుడపవాదువచ్చెనని యింటగృశించిదురాత్ముడొక్క డీ
నెపముఘటింపజేసెనని నేబరదూషణజేయనేల ము
న్నెపుడుమహాత్ములన్,ద్విజుల నేగతినిందలజేసినాడనో
యిపుడదిబోవునే యనుభవింపకబోయిన .... 82

ఉ॥ తొల్లిటిజన్మపుణ్యమునదోషముమోపి మదీయపాపమున్
జల్లగదొంగిలించుకొని సద్గతికిన్ననుబంపుచుండె వీ
రెల్లరుగానవీరలకు నేగతిజూపిదయామయుండవై
పుల్లసరోజనాభ యికబ్రోచెదవోకద .... 83

చం॥ పరులపవాదుమోపిరను వాక్యములోగలభావమేమి నీ
వరయవసించుచున్ మనుజులందునసన్నుబరీక్షసేయ ని
త్తరినిటుపల్కజేసితిని ధన్యుడవోనరులెంతవార ల
త్తైరగునమాటలాడుటకు దీనదయాపర .... 84

ఉ॥ దోషములెన్ని యోకలవు, ధూర్తప్రవర్తనచావలేదు,వా
గ్భూషణమైనకల్ల, గురుపూజ్యులయందనురక్తినాస్తి, పై
వేషముచేమహాత్ముఁడన బెట్టుగనుంటిక్షమించునన్ను ని
ర్దోషునిచేసిముక్తికొక త్రోవనుజూపర .... 85

చం॥ తగునపరాకునాయెడల దాసుఁడగానపదంబులంట నా
మొగమునుఁద్రిప్పియొక్కపరి పుత్రునిదీనయవస్థచూడవా
నగధరయేమిపాపమిది సన్నుపరీక్షనుచేయబూనితే?
ఖగకులనాథవాహన వికారములేటికి .... 86

ఉ॥ చేరితిపండరీపురము జేసితిస్నానముచంద్రభాగలో
గోరికదీరనీవిమల కోమలపాదములంటి నేనమ
స్కారముజేసిహర్షపుల కాంకితదేహుఁడనైతి పాపసం
భారముభస్మమయ్యె నికజన్మతరించెను .... 87

చం॥ కలిగినకల్గుగాత కృతకర్మవిశేషఫలంబుచేత ని
శ్చలయుతభక్తిశక్తి జనసన్నుతకీర్తిమహత్ప్రభావముల్
కలవనియిన్నిమానవుఁడు గర్వమహంకృతి నేలపొందగా
వలె దనకంటెనుత్తములు భక్తులులేరొకా .... 88

ఉ॥ వాయువులో ప్రసూనములవాసనగుప్తతెరంగులీనమై
కాయముపైనవీచినను ఘ్రాణమెదానినెరుంగునట్టు లీ
మాయజగంబులో మిలితమైననినున్గన భూతరక్షణో
పాయులెగాక మూఢజనబంట్లకుశక్యమె .... 89

చం॥ శరశతకోటిపైబడిన జక్రముబట్టకనోకిరీటి సం
గరమునదేరుదోలుచును గాలముబుచ్చెదనన్ననీవె యా
కురుకులభీష్ముఁడేయు ఘనకోలలధాటికినాగలేక దొం
దరవడిచక్రమందుట యధర్మము? ధర్మము? .... 90

ఉ॥ పండితపామరుల్ ముఖముపైముదమున్ గనుపర్చుచుండు రే
పండుగపేరపప్పులను పాయసమున్ దినవచ్చునంచు నీ
బండుగమొన్నపండుగకు వర్షమునాటికినేటికట్టి మా
ర్పుండెదునంబులో ననకమోక్షప్రపత్తికి . . 91

చం॥ మురిపెముతోడషడ్రుచులు బొర్రలనిండభుజించి వీధిలో
తిరుగుచుకోరమీసముల ద్రిప్పుచుతిట్టుచువారివీరి నా
తెరవునబోవుసాధువుల దీనులపేదలజూచినవ్వుచుం
దురు ధనమత్తుచేఖయిలు దూరమెరుంగక .... 92

ఉ॥ పావనుడైనసజ్జనుని పజ్జనుజేరినసంస్మరించెదన్
పావనులైతరించెదరు పాపమనస్కులనంగ వేరుగా
నేవివరింపగావలయునే హరిభక్తులజేరువారు తే
జోవరులైతరింతురని శోకనివారణ . . . 93

చం॥ చిరుతలుచేతబట్టుకొని చిందులద్రొక్కుచులోకవాసనల్
దరిమిశరీరమున్ మరచి తన్మయమొందినినున్ భజించు యా
పరమసుభక్తకోటిపదపద్మము లన్గలధూళి భక్తితో
శిరమునదాల్చ మానవుఁడుచెందడె మోక్షము .... 94

ఉ॥ తప్పుడుమార్గవర్తనులు తప్పులులేనిమహాత్ములందు నే
తప్పుడునిందలోనునిచి తక్కినవారికిగూడచెప్పి బల్
తిప్పలబెట్టజూచెదరు ధీమతులాయపవాదులెంచియున్
ఒప్పరుమారుకీడునకు నోవికజూపుచు .... 95

చం॥ కనకముపైననాశ కలకంఠులపైగలమోహకామముల్
గినుకవిరోధులందు హరికీర్తనలన్నను పేక్ష సాధుస
జ్జనఘనులందసూయ నొకసారియుగూడ మదీయచిత్తమం
దునదలసూపనీయక వధోక్షజబ్రోవర .... 96

ఉ॥ శ్రీకరుణాలవాల సురసేవితపాల వికుంఠపాల భ
క్తాకరశీల నారదసుధారసగానవిలోల గోపికా
లోకమనోవిహార రిపులోకవిపాల యశోవిశాల ల
క్ష్మీకరహేమచేల తులసీవనమందిర .... 97

చం॥ నరహరిఏకనాథ హరినాధత్రిలోచననామదేవ యో
హరునరసింహమేధ త్రిపురాంగదభూపతిశూరకూర్మ శ్రీ
గిరిధరలాల్ పిపాజినిమికేశవమాధవ భానుదాసులన్
గురుకృపనేలినట్లు ననుగూడదలంపర .... 98

ఉ॥ మంగళశైలమెక్కి ఘనమంగళమూర్తి నినిన్నుగొల్చి నీ
యంగనయున్నపైగిరికి నల్లనబోయినమస్కరించి వే
గంగిరిడిగ్గికోవెలలొ నర్చకులిచ్చిననీప్రసాదముల్
సంగతితోభుజించితిని జన్మతరించెను .... 99

చ॥ తనయులులేకలేక బరితాపమునొందెడినాగమాంబతో
మనమునగుందనేల సుకుమారుఁడుపూజ్యుఁడుగల్గుగాని పా
పనిమృదుపల్కులైన వినుభాగ్యములేదవిసాదువాఁడ మ
జ్జననిమనోగతంబెరుగ శక్యమెయేరికి .... 100

ఉ॥ పావనుఁ నపర్తికులవర్యుఁ డనంతయకాత్మజుంప సు
బ్రాపనియంబ్రునన్ బుధులు రాధనుగూడినకృష్ణనామ సం
జీవిరసంబుద్రాపుచును జీవమునిల్పినవ్యాధిగ్రస్థుడస్
దేవపరాకుసేయకను దీనునిబ్రోవర .... 101

చ॥ సతతమునీవునాహృదయ సౌధమువైనటియించుచుండి యీ
శతకముపూర్తిసేయ పలుశబ్దములన్ సమకూర్చితెల్ప నే
నతికితియిట్లు దానపరమార్థమునాకును నీకుభక్తసం
తతియెడప్రేమగన్పడె నితాంతదయాపర .... 102

ఉ॥ ఓరిమితోప్రమోదమున పుత్పలచంపకపద్యపుష్పముల్
గూరిచినూరుమాలపలెగుచ్చి భవద్గళసీమయం దలం
కారముచేయబూనితిని కాదనకన్ గళమందుదాల్చి మ
ద్గౌరవమింకగావుమని కాళ్ళనుబట్టితి .... 103

చ॥ ఒడలికిజందనంబలది యుజ్జ్వలభక్తినిదెచ్చిపుష్పముల్
వడివడిపూజచేసి కడుభక్తినిధూపమువేసి దీపమా
కడనిడి పాలువెన్నకలకండఫలంబులనారగింప న
క్కడనిడిపీడెముంచితిని గైకొనుమిప్పుడు — 104

ఉ॥ మంగళమూదిమూర్తి జయమంగళమంగజకోటిరూప స్తొ
మంగళమోళుభాంగ శుభమంగళమోతిర్జిగద్గురో హరీ
మంగళమంచుదాడుచును మంగళహారతులన్ ధరించి దే
వాంగనలిందువచ్చిరిక హారతిగైకొను — 105

చం॥ జయజయహారతింగొనుము సద్గురుచంద్రమ కీర్తిసాంద్రమా
జయజయహారతింగొనుమ సాగరమందిర శ్యామసుందరా
జయజయహారతింగొనుము సాధువశీకరశత్రుభీకరా
జయజయహారతింగొనుము జైపరమేశ్వర— 106

ఉ॥ ఆడుచుపాడుచున్ శతకమంచితభక్తినిబూర్తిజేసి బల్
వేడుకనీపదాలకడబెట్టి భళీయిటువంటిభాగ్య మే
నాడులభించుమూఢునకు నాతొలిపుణ్యఫలంబుచేత నీ
జాడరచించినాడనని సాగిలిమ్రొక్కెతి — 107

చ॥ గిరిధరఒక్కవందనము కేశవరెండవవందనంబిదే
పరమకృపాళొమూడవది బాగుగనాల్గవవందనంబిదే
సరసిజనేత్రయైదవది చక్కగనారవవందనంబిదే
వరదవిదేహిసౌపరకు వందనకోటులెరాధికేశ్వరా॥ 108

ఉత్సాహము

జయము జయము జయము జయము జయము శ్యామసుందరా
జయము జయము జయము జయము జయము భక్తవత్సలా
జయము జయము జయము జయము జయము శత్రుభీకరా
జయము జయము జయము జయము జయము రాధికేశ్వరా॥

